# హంసధ్వని

( రాగమాలిక )

ప్రచురణ ఆధ్వర్యం :

కిన్నెర ఆర్ట్ థియేటర్స్
హైదరాబాద్




ఎల్. మాలకొండయ్య

Hamsa Dhvani : Lyrics (Songs) Telugu by L. Malakondayya.
January, 1981. Copies 1000. P.P. 80

 

ముద్రణ 1981.
ప్రతులు 1000.

వెల :
సాధారణ ప్రతి : రూ. 2-00.
గ్రంథాలయ ప్రతి : రూ. 6-00.

ప్రతులకు :

1. కిన్నెర ఆర్ట్ థియేటర్స్
2-2-647/153
సెంట్రర్ ఎక్సైజ్ కాలనీ
హైదరాబాద్-500 13.
Phone : 703318.

2. శ్రీ ఎల్. శ్రీనివాస్
94, శ్రీనగర్, కాలనీ,
హైదరాబాద్-500873,

ముద్రణ :
శ్రీ వివేకానంద ప్రింటర్స్
లక్డీకాపూల్
హైదరాబాద్.

నాలో

సాహిత్య, సంగీతోత్సాహాలను

ప్రోత్సహిస్తున్న

మిత్రులు

మహాకవి, కళాప్రపూర్ణ

డా. బోయి భీమన్నగారికి

# రాగ సుధ

చిన్ననాటి నుండి, సంగీత, సాహిత్యాలంటే నాకెంతో అభి అభిలాష, ఎంతో ఉత్సాహంకూడ, క్రొత్తగా, ఏదో చేయాలన్న ఉత్సాహం, ఆరాటం, నాలో, ఉవ్విళ్ళూతలూగుతూవుంటుంది. నా అదృష్టవశాత్తు, నాకు, లభించిన, నా భర్తగారు, శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారికి, ఈతృష్ణ, నాకన్న రెండాకులెక్కువకావడం, మా అభిప్రాయాలు, ఏకమవడంమూలానా, మా పిల్లలకు అట్టి వాతావరణమే అబ్బినందువలన, మాఅన్వేషణ కొనసాగుతూ, సత్ఫలితాల్నందిస్తూ వుందీ నాటివరకు, మాకుటుంబమే 'రాగసుధ'గా మారింది

శ్రీమాలకొండయ్యగారి గేయాలను, ఒక సమావేశములో, సినీసంగీత దర్శకుడు, గాయకుడైన శ్రీ S. రాజేశ్వరరావుగారు పాడగా వినడం జరిగింది. ఆ గేయాలు మమ్మల్నెంతో ఆకర్షించాయి. భాగ్యవశాత్తు వారి పరిచయం లభించడం, వారి గేయాలను పరిశీలించడం ఏర్పడింది.

మాకు పరిచయం కాకపూర్వం, మాలకొండయ్యగారు, ఒట్టి కవులు మాత్రమేనని అనుకొన్నాము. కాని వారు ఉన్నత పదవిలో ఉద్యోగనిర్వహణచేస్తూ ఇంతగొప్ప కవితలను వ్రాయగలిగారంటే, వారి ఆశక్తి, కళాపోషణలను ఎంతో అభినంధించక తప్పదు. నోరు తిరగని సమాసాలతో,శ్లేషాలంకారాలతో ఛందోబద్ధంకాక, సర్వసాధారణ, వ్యావహారిక, భాషయందు, అతిచక్కగా అరటిపండు వలిచిపెట్టినట్లుండే, వీరి కవితాదోరణి, ఎంతోహాయిగా వున్నది. వారి కవిత్వానికి, 'ఇది, అదీ' అనే తారతమ్యాలులేవు. దేశభక్తి గేయాలైతేనేమి, భక్తిగీతాలైతేనేమి, ఇతరత్ర, ఎన్నోవిధాలైన గీతాలు, ఒకదానినిమించి ఒకటి గీటురాయిలా నిలిచాయి. మచ్చుకు- "అలలను, కలలను" పోల్చి ఒక చక్కటి, గేయం వ్రాసారు. అది ఎంతో అనుభవపూర్వకమైనది.

ఇట్టి స్వచ్ఛందభావాలతో తేలిక పదజాలంతో, పేద, ధన వంతులనే, బేధములేక, అన్నిరంగాలు అన్నివర్గాల, వారికందు బాటుగా, హాయినిగూర్చే, కవితలల్లిన పీంసి, ప్రజాకవి అనటంలో, అతిశయోక్తిలేదు.

వీరు సంగీతానికి, అనుగుణ్యంగా, లయ, మాత్రకాలములతో వీరి కవితలను, అల్లకపోవుటచేత వారి భావావేశపు, పదజాలములను, పాణిగట్టుటలో కొద్దిశ్రమపర్పడినను, సంగీతమునకు వీలుగా, పద జాలములను, సర్దుపాటుచేసుకొనుటకు, వారు నాకిచ్చిన, స్వతంత్ర్య మునను, సద్వినియోగంచేయుటచే, ఏర్పడినదీ గీతసంపుటి. స్వర పరచిన బాణీలు, వినయింపుగానున్నవా, లేవాయని, నిర్ధారణ చేసు కొనుటకు, టి వి. ఆర్టిస్టు, రేడియో ఆర్టిస్టు అయిన మాఅమ్మాయి సి. పద్మజ చేతపాడించి విన్నాము. మాకు తృప్తిగావుండినది. అదీ గాక, ఇటీవల, ''ఆంధ్రప్రదేశవతరణ'' సంధర్భంగా, వీరిగేయాలకు నేను స్వరకల్పనచేయడం, అవి, టి. వి.లో మాఅమ్మాయిచేత పాడ బడటం, ప్రజాదరణ పొందటం జరిగింది. ప్రజాకవి రచనల నామో దించిన ప్రజలు, నా సంగీతాన్ని ఆమోదించారని తృప్తి ఏర్పడ్డ తర్వాత తతిమ్మగీతాలకు బాణీలుకట్టి ప్రచురించడం జరిగింది. నాలో ఉరకలెత్తుతున్న కొత్తదనానికిదొక సవాలై, నాలో సంగీత ఝురు లుగా ప్రవహించినది. అదే ఈ గీతమాలిక, ఈ రాగసుధ. ఇట్టి కొంగ్రొత్త గీతమాలికలు ఇంకా ఎన్నో మాలకొండయ్యగారి కలం నుండిని వెలువడాలని ఎదురుచూస్తూ ఆహ్వానిస్తున్న-

సంగీతాభిలాషి,

**ఇందిరావణి**

డైరెక్టర్, రాగసుధ,

దోమలగూడ, హైదరాబాదు.

# మనసును నవ్వించి కవ్వించే పాటలు

శ్రీ మాలకొండయ్యగారి రచనల్లో మొట్టమొదట నాకు నచ్చిన "నవ్వు నవ్వించు ఈలోకాన్ని" అనే పాటకు స్వరకల్పనచేశాను. తరువాత వారు నాకు వైవిధ్యంగల అమూల్యమైన పదిహేను పాటలకు స్వరకల్పనచేసే అవకాశం కలిగించారు. ఆ పాటలువిన్న ప్రతివాళ్ళు మరోసారి పాడమని అడిగి పాడించుకున్నారు. అందులో ముఖ్యంగా "మృగం కంట నీరుకారితే" అనే కరుణారసం తొణికిసలాడేపాట ప్రతి ఒక్కరి హృదయంలో నాటుకుపోయింది, ప్రతి కవి ఫీలయి వ్రాసే పాటలు కొన్నిఉంటాయి. కాని శ్రీమాలకొండయ్యగారు అలా కాక ప్రతిపాటలో తన అనుభవాన్ని అద్దంలోలాగ కనబరుస్తారు. అందుచేతనే అవి కేవలం పండితులకేకాక పామరులకుకూడా తేలికగా అర్థమయేటట్లు ఉంటాయి. నాకు వారిపాటల్లో బాగానచ్చింది. "బాల్యం ఒక పవిత్ర స్వర్గం" "నమ్మితాను నేను" అనేవి. ఎందుచేతనంటే చిన్నతనం గురించి ఊహించడం చాలా కష్టం, జీవితంలో గట్టినమ్మకం చాలామందిలో అరుదు. అలాంటిది వారు ఎంతో హాయిగా మళ్ళీ బాల్యదశవస్తే బాగుండును అనిపించేలా వ్రాసారు జీవితంమీద నమ్మకం కలిగించారు. ఇలాచెప్పుకుంటూ, వారి పాటలను సమీక్షిస్తూపోతే అది ఒక మహాగ్రంథం అయినా ఆశ్చర్యపడనక్కరలేదు! ఒక్కమాటలో చెప్పాలంటే వారిపాటలు మనసును నవ్వించి, కవ్వించేవి! శ్రీమాలకొండయ్యగారు నాకు ఈ అవకాశం కల్పించినందుకు కృతజ్ఞలతో-

మురళీకృష్ణ

# మరో మెట్టు

1977లో కిన్నెర ఆర్ట్ థియేటర్స్ స్థాపించబడింది. ప్రోత్సాహిక కళాకారుల్ని ప్రోత్సాహించటం, ఆదర్శప్రాయులైన కళారాధకుల్ని యథోచితంగా సత్కరించటంవంటి లక్ష్యాలతో నేటికి 30 కార్యక్రమాలు నిర్వహించటం జరిగినది

అయితే - మాయీ విజయపరంపరలకు కొండంత అండగా నిలవడమేకాకుండా కిన్నెరకు అధ్యక్షులుగా వ్యవహరిస్తున్న డైరక్టరు జనరల్ ఆఫ్ పోలీస్ శ్రీ యం.వి. నారాయణరావుగారి ఆశీర్వాదమే మాకు ఊతకర్ర అని మనవి చేసుకొంటున్నాం

గీతరచయిత, విద్యుత్కవి సహృదయులు కిన్నెర సభ్యులు శ్రీ మాలకొండయ్యగారి లలితగీతావళి 'హంసధ్వని' ని మీకు అందించే అవకాశం కల్గినందుకు మేమెంతో ఆనందిస్తున్నాం.

ఉత్తమోత్తమైన విలువలుగల సాహిత్యాన్ని మీకు అందించాలన్న కోరికతో "కిన్నెర పబ్లికేషన్" ఆచార్య తిరుమాలగారు రచించిన "పల్లవి"తో ప్రారంభించాము

మా కిన్నెర సంస్థకు ప్రార్థనాగీతాన్ని శ్రీ యల్. మాలకొండయ్యగారు రచించడం మా అదృష్టం ఆ ప్రార్థనాగీతమే ఈ గీతమాలికలో మొదటిపాట. ఈ పాటకు అమర్చిన హంసధ్వని రాగము ఈ కావ్యానికి మకుటంగా స్వీకరించడం ముదావహం.

ఈ "హంసధ్వని" ప్రచురణలో "కిన్నెర"ను మరోమలుపులు త్రిప్పుతున్న శ్రీ యల్. మాలకొండయ్యగారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెల్పుకొంటున్నాము.

కిన్నెర నిర్వహించే ప్రతికార్యక్రమానికి, ప్రతిసారి ఇలాంటి పుస్తకాలు రావటం, కిన్నెర పురోభివృద్ధికి దోహదం చేస్తాయని ఆశిస్తూ-

M. V. నారయణరావు I. P. S.
అధ్యక్షులు

మద్దా రఘురామ్
ప్రధాన కార్యదర్శి

# రాగ మాలిక

"హంస ధ్వని"కి పునాది 4-2-72 కాకినాడ బోట్‌క్లబ్‌లో ఆరోజు మిత్రులు వాడ్రేవు నారాయణమూర్తిగారు జరిపిన "మాల కొండయ్య సాహిత్య సాయంత్రం" అనే సమావేశంలో ముఖ్య అతిథి మహాకవి డా॥ బోయి భీమన్నగారు, అప్పుడు బాగా ప్రచారంలో ఉన్న నా " జీవిత వలయాల్లో" నుండి గేయాలను ఎవరైనా పాటలుగా పాడితే వాళ్ళకు బహుమతి ఇస్తానని ప్రకటిం చారు. అక్కడికక్కడే కొందరు యువకులు "పొద్దున్నే లేస్తాడు" అనే రైతు జీవితాన్ని చిత్రించేగేయాన్ని. "గల గలా పారే సెల యేరు" అనే కొండవాగు గుణగణాలను వర్ణించేపాట, "ఎవరో ఆ చిన్నది" అనే పేదరికాన్ని చిత్రించే పాటలను, బాణీలు కట్టకుండా, సాధనచేయకుండా, మార్పులు, కూర్పులు, చేర్పులు లేకుండా అందంగాపాడారు. ఆప్రోత్సాహంతో నేను రచించిన "మాటంటే మాట" అనే నాటికలో మూడు పాటలువ్రాసాను. తదుపరి ఎందరో మిత్రులు, విమర్శకులు నా గ్రంథావిష్కరణ సభల్లో నేను వ్రాసిన గేయాలెన్నో సంగీతానికి, అవసరమైతే కొద్దిమార్పులతో, ఎంతో అనువుగా ఉన్నాయని చెప్పడంతోను, పైని పేర్కొన్న మూడు పాటలను ఆకాశవాణి ఈ మాసపుపాటలుగా మిత్రులు పాలగుమ్మి విశ్వనాథంగారు ఎన్నుకొని నన్నుప్రోత్సహించడంతోను తోచినప్పు డల్లా కొన్ని పాటలు వ్రాస్తూవచ్చాను. నా పాటలను తన సంగీత దర్శకత్వంలో మొట్టమొదట తెలుగుప్రజానీకానికి పరిచయంచేసిన శ్రీపాలగుమ్మి విశ్వనాథంగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

తర్వాత రేడియోలో, టెలివిజన్‌లో ఎన్నోపాటలు ప్రసారమై శ్రోతల మన్ననలను చూరగొన్నాయి. "తాండవకృష్ణ తారంగం" "ఈ కాలం కథ" సినిమాల్లోకూడా నా పాటల రికార్డులు వచ్చాయి

మొట్టమొదట వంశీ ఆర్ట్స్ శ్రీ రామరాజుగారు చలనచిత్ర సంగీత దర్శకులు శ్రీ టి. వి. చలపతిరావుగారి అధ్యక్షతను "మాల కొండయ్య సంగీత సాయంత్రం" జరిపించారు. ఆ కార్యక్రమం యువ సంగీతదర్శకులు విన్నకోట మురళీకృష్ణగారి పర్యవేక్షణక్రింద ఘనవిజయంగా జరిగింది. తర్వాత భావనా Film Relation తర పున శ్రీహరిశ్చంద్రప్రసాద్‌గారు, ప్రముఖ చలనచిత్ర సంగీత దర్శ కులు శ్రీసాలూరి రాజేశ్వరరావుగారి అధ్యక్షతన, శ్రీ వి. మురళీ కృష్ణగారి సంగీత పర్యవేక్షణలో మరో "మాలకొండయ్య సంగీత సాయంత్రం" చక్కగా జరిపారు.

ఇటీవల మిత్రులు రాగసుధ శ్రీ సి. సుబ్రమణ్యంగారు నా గేయరచనలు చదివి, తమ సతీమణి శ్రీమతి ఇందిరామణిగారిచే ఎన్నో గేయాలను పాటలుగా అనేకరాగాల్లో బాణీలు కట్టించి తమ కుమార్తె చి. పద్మజచే టెలివిజన్‌లో ఎంతో శ్రావ్యంగా పాడించారు. ఈలోగా "కిన్నెర ఆర్ట్ థియెటర్సు" మద్రాశి రఘురాంగారు తమ సంస్థ తరపున నాపాటలతో ఒక సంగీత సాయంత్రం జరిపి, ఆపాటల నొక పుస్తకరూపంగా ప్రచురిస్తామని ముందుకువచ్చారు. తత్ఫలి తమే ఈ నాటి "మాలకొండయ్య సంగీత సాయంత్రము", హంస ధ్వని," ఆవిష్కరణ. ఇందుకు కారకులైనమిత్రులు శ్రీ యం. వి. నారాయణరావు I. P S గార్కి శ్రీ ఎమ్. రఘురాంగార్కి, కిన్నెర ఆర్ట్ థియేటర్ వారికి నా అభినందనలు.

నా పాటలు ప్రజాదరణపొందడానికి ప్రత్యేకకారకులైన శ్రీ పాలగుమ్మి విశ్వనాథం, కీ. శే శ్రీశశాంక, శ్రీ నండూరి విఠల్, శ్రీ విన్నకోట మురళీకృష్ణ, శ్రీమతి సి ఇందిరామణి, శ్రీవంశీరామరాజు శ్రీభావనహరిశ్చంద్రప్రసాద్, శ్రీ కిన్నెర రఘురాంగారలకు నేను మరోసారి కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

తొలిసారిగా "తాండవ కృష్ణా-తారంగం" అన్న చలన చిత్రానికి, మరికొన్ని గ్రామ్‌ఫోన్ రికార్డులకు, శ్రీ టి. వి. చలపతిరావు గారి సంగీతదర్శకత్వంతో, నా పాటలు శ్రీయుతులు యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, జానకి, శైలజ, రామకృష్ణ, విజయలక్ష్మీశర్మ గారలు ఎంతో శ్రావ్యంగాపాడారు. వాళ్ళందరికి నా అభివందనలు

"హంస ధ్వని"ని ఆవిష్కరిస్తున్న ప్రఖ్యాత చలనచిత్ర సంగీత దర్శకులు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారికి, నా గ్రంథాన్ని అందంగా ముద్రించిన వివేకానంద ప్రింటర్స్‌వారికి, ముఖచిత్రాన్ని ఆకర్షణీయంగా చిత్రించిన శీలా వీర్రాజుగారికి నా అభివందనలు.

హైదరాబాద్  
11-1-1981.

ఎల్. మాలకొండయ్య

# విషయ సూచిక

౩.	అన్నీ సహిస్తూ, ఆశనే వరిస్తూ,
సాగిపోతూంటాడు, రైతురాజు
ఎప్పుడు బాగు, పడతాడో, చిక్కుల వల నేలా విప్పుతాడో
ఏదో ఒకరోజు రాదా, లేదా సంతోషం, రైతురాజుకు
॥ప్రా॥

# కిన్నెర

రాగము : హంసధ్వని

కిన్నెర, కిన్నెర, వన్నె, వన్నెల కిన్నెర
సర్వకళలకు, నిలయం, కిన్నెర సరస్వతి దేవికి
చెలికత్తియగా, కళామ తల్లిగ నిలచిన కిన్నెర ॥కి॥

రాగం - కాపి

సంగీత సాహిత్య కళలకు కిన్నెర
సరిగమలతో వన్నె దిద్దేటి కిన్నెర
సరళ సంగీతం నాట్యం నృత్యం

మ. కా. రాగతాళ విన్యాసం లాస్యం
సర్వ కళానిలయం, ఆలయం ॥కి॥

రాగం - హంసానంది

మమతలు ప్రేమలు మనుషుల మనసుల్లో
ఎన్నోరంగముల వికసింపజేసి
అప్సరసల మించు అందాలరాశి
గంధర్వుల మించు సౌందర్యలహరి

మ. కా. సాటి సంస్థల సహకారం
తోటి వ్యక్తుల సహవాసం
సమాజ వికాసమాశయం
ప్రజలాదరణె కళార్పణం ॥కి॥

# "ఆంధ్రప్రదేశవతరణ"

రాగం - మధ్యమావతి తాళం - ఆ

పల్లవి

॥ ఆంధ్రప్రదేశం, అవతరించింది
పహెలీ పచ్చీస్, వచ్చేసింది.

అనుపల్లవి

॥ అందాలెన్నో, అందుకొని, ఆనందాన్ని, పెంచుకొని
నిత్యకల్యాణం, పచ్చతోరణం,
ఎంతోవింత, శృంగారాలు,
ఎంతోవింత, వేడుకలు ॥ఆం॥

మొదటి చరణం

రాగం - రేవతి

మూడు ముక్కల, ముచ్చటగానతకాలి
నదీజలాల, పదిలంగా వాడాలి
భాషలో వ్యత్యాసాలు, మాటలోమార్పులు మరవాలి,
(మధ్యమకాలం)
ముందుకు సాగాలి, పాతను విడవాలి
బాధ్యత పెరగాలి, అందరు కలసివుండాలి ॥ఆం॥

రాగం - హంసధ్వని

చరణం 2

అయిదుకోట్ల, తెలుగుజనం
కలసి, మెలసి, మెలగాలి
కులము, మతము, వేరైనా
మనుషులంద, రొక్కచే
ప్రతినిధులు, ఎందరున్నా, ప్రజలంతా ఒక్కచే
శాంతిపథమే, మనమార్గం,
క్రాంతిపథమే, మనజీవం
ఆంధ్రప్రదేశవతరణం
అంతులేని, ఆనందం ॥అం॥

# "ఆంధ్రప్రదేశం"

రాగమాలిక ;

పల్లవి

1. సామంతరాగం

ప్రగతికి. ప్రజాక్షేమానికి, అంకితం, మన ప్రభుత్వం
ప్రతివిషయంలో, ప్రథమస్థానం; భారతదేశానికే
వన్నెదెచ్చిన మన రాష్ట్రం, ఆంధ్రప్రదేశం
ఆంధ్రప్రదేశం, అన్నిట్లో, అగ్రస్థానం, పొందాలి
అన్నపూర్ణమన, ఆంధ్రప్రదేశం, అభివృద్ధికి, ప్రతిరూపం,
జాతిప్రగతి; సోపానంలో, పాతికేళ్ళు వచ్చాయి:
ఆంధ్రప్రదేశవతరణం, శాంతికి నిలయం, క్రాంతికిసౌధం

||ఆం||

చరణములు

1. వలజిరాగం

కాకతీయ శౌర్యపటిమ, కొండవీటి మెండు ప్రతిభ
పలనాటి వీరగాథ, విజయనగర, విజయశోభ
కృష్ణదేవరాయలు, రాజరాజనరేంద్రుడు
అనవేమభూపాలుడు, ప్రతాపరుద్రుడు
బాలచంద్రపాపరాయ, రుద్రమదేవి
చరిత్రకర్తలు, మన, మార్గదర్శులు, మార్గదర్శులు ||ఆం||

వసంతరాగం

2. స్వాతంత్ర్య యోధులు, తెలుగువీరులు
గాంధీనెహ్రూలతో, చేయికలిపి
దాస్యశృంఖలాలు త్రెంచి, ధన్యచరితులైనవారు
కీర్తివంతులు, మన తెలుగునేతలు
తెలుగుజ్యోతి, నలుమూలల, తప్పక వెలిగిద్దాం
తెలుగువారే, దేశానికి, వెలుగనిపిద్దాం ॥ఆం॥

కుంతలవరాళి

3. అన్నవరం, అమరావతి, ద్రాక్షారామం
భద్రాచలం, ధర్మపురి, శ్రీశైలకాళహస్తి
వేంకటాద్రి, సింహాచలం, వేములవాడ
మనశిల్పభాగ్యాలు, మన పుణ్యక్షేత్రాలు
గలగలపారే గోదావరి, మిలమిలమెరిసే కృష్ణవేణి
శబరి శారద, పినాకినీ మనకు, మహానదులు,
మనజీవనాడులు ॥ఆం॥

4. పాడిపంటలు, పశుగణాదులు, పరిశ్రమవాడల నిర్మాణం
ఆనకట్టలు, ప్రాజెక్టులు, చక్కెరమిల్లులు, ఫ్యాక్టరీలతో,
ముందడుగు మనం వేస్తున్నాం, రైతులబరువులు తగ్గిస్తాం
ప్రజల బాధల తీరుస్తాం, జనులకుపాధులిప్పిస్తాం ॥ఆం॥

సామంతరాగం

5. అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన, బరైటీస్
అల్యూమినియానికి బాక్సైట్, దేశమున పేరుగన్న,
సల్లబంగారం, సింగరేణి
గనులు, ఖనిజం, పాడిపంటలే, మనపాలిటి
భాగ్యవరాలు, ఆంధ్రప్రదేశపు సౌభాగ్యాలు ॥ఆం॥

# "హరిజనులంటే"

రేవతిరాగం - ఆదితాళం

"పల్లవి"

"హరిజనులంటే, పరజనులా
హారందరిలో, సములుకారా

"అ ప."

అభిమానవంతులు, హరిజనులు
కారాజాతికే, పునాదులు
ప్రజాపాలన, పరిపాలనలో
మనదేశంలో, అందరికీ, అందరిదీ, సమభాగం

"చరణం"

హంసానంది

1. హరిజనులంటే, మనుషులుకారా,
మనుషులలో తేడాలా,
కులము, మతము, కుమతులసృష్టి
కులముకంటే, గుణమే మేలని,
మతముకంటే మనిషే మేలని, వినలేదా, వినలేదా

## సింధు భైరవి

అంటరానితనం, అపరాధమని,

పేదలనణచడం, పాపమని

కలిమిలేములకు, కారణమేమని

ప్రగతిలో హరిజనులు, ఎంతోమూలమని

భావిభారత, రథసారథులని

అన్యాయాన్ని, అపఖ్యాతిని

భేదాలనుమనం, గమనించాలి

గమనించి మనం, సవరించాలి. ॥హా॥

# "అలలు - కలలు"

*రాగం—వలజి*

ప॥ అలలకు లేదు, అలసట, కలలకు లేదు, వేసట

అ॥ ప॥ విరామంలేక, ఫలితం కోరక, అలలు శ్రమిస్తాయివదలక
కలలు కంటారు, ఖర్చులేక, మంచికలైతే పొందుతారు
ఆనందము, చెడుకలైతే, దుఃఖము ॥అ॥

*చరణం:-*

1. పనిలేని సముద్రం, అలలను ఒడ్డుకు పంపి
అవిగట్టును, హత్తుకొని, ముద్దులు పెట్టచూసి,
ముద్దు మురిపెం, ముగియకముందే,
కౌగిలి, గిలిగింతలు, పొందకమునుపే
కడలి అసూయతో, అలలను, వెనక్కి
లాగేస్తుంది, కళ్ళెంవేస్తుంది ॥అ॥

2. జీవితంలో పొందని, అనుభవాన్ని
అందరాని, ఆనందాన్ని, స్వప్నంలో పొందవచ్చు
కలలో కన్న, అనుభూతి, పొందకముందే
చుప్పనాతి నిద్ర, ఓర్పులేక చప్పున
ఈర్ష్యతో, మేల్కొల్పుతుంది,
ఎందులో వున్నా, లేకున్నా
ఇందులో అలలకు, కలలకు, పోలికలొకటే ॥అ॥

# "ఈశ్వరుడతడే"

*రాగం—హింమోళ*

*తాళం-ఆది*

పల్లవి: ఈశ్వరుడతడే, పరమేశ్వరుడతడే
అతడే దేవుడు, అందరి పాలిట ॥ఈ॥

అ. ప. అందరి పూజా, దైవంబతడే
ఎల్లర చల్లగ, జూచేదతడే
పెద్దల పిన్నల, బ్రోచేదతడే
సద్దుగ జగతిని, నడిపేదతడే॥

*చరణములు !*

1. ఏసు పేరున, వెలసిన దతడే
కృష్ణుని పేరున, చరించిన దతడే
అల్లా పేరున, అలరిన దతడే
అన్నిట తానే అభయ ప్రదాతై ॥ఈ॥

2. జీవకోటికి, జీవము నిచ్చి ప్రాణాకోటికి అభయమునిచ్చి
ఎండా గాలిని, నిండుగా నిచ్చి
ప్రేమను పెంచి, ఈర్ష్యను తుంచి
జగతిని కాచే దేవుడు అతడే ॥ఈ॥

# "అనిపిస్తుంది"

రాగం:- కర్నాటక దేవ గాంధారి

పల్లవి: అనిపిస్తుంది, నాకు అనిపిస్తుంది,

ఏదో చెప్పాలని, అనిపిస్తుంది, నాకు, అనిపిస్తుంది॥

చరణములు

1. ఆవేగం. ఆవేశం, ఉద్వేగం, ఉత్సాహం
ఆవేదన, ఆందోళన, ఉద్రేకం, ఉరకలేస్తూ
అడ్డుగట్లు లేకుండా తోసుకువస్తుంటే
ముందుకురుకుతుంటే, అనిపిస్తుంది, నాకు అనిపిస్తుంది ॥అ॥

2 వయసు కొంతమళ్ళినా (మళ్ళీ చూడాలనిపిస్తుంది)
చూడాలనిపిస్తుంది, వెనక్కెళ్ళి, మొదటికెళ్ళి
నడవాలనిపిస్తుంది, చూసేవన్నీ, చేసేవన్నీ
ఆలోచనలన్నీ, ముసుగువిప్పి, తనివిదీర, చెప్పాలని, నాకు ॥అ॥

3. కలం, కుంచె, రంగులతో, కథలు, కవితలుగా,
కాలాన్ని చిత్రించి, కట్టివేయాలని, కవిగా
అనుభూతులను, పదిమందితో,
పంచుకోవాలనీ, జగతిలో వెదజల్లాలనీ, అనిపిస్తుంది,నాకు ॥అ॥

# "మారాలి, మారాలి"



రాగం: కళ్యాణవసంతం

పల్లవి

"మారాలి, మారాలి, మనమంతా మారాలి" ॥మా॥

అ. ప॥ పనికిరాని, పాతను, విడనాడాలి.
పనికొచ్చే, కొత్తనుచే, పట్టాలి
మనమాటల్లో, మనచేతల్లో, మారుపురావాలి
చెదరిన మనజాతికి, చైతన్యం రావాలి ॥మా॥



చరణం:

1. ఉంటాయి, కొందరికి, ఊరంత ఇండ్లు
అందులోనుండ, మనుష్యులులేకున్నా,
కోట్లకొద్ది ప్రజల, కాకాశమేగూడు
గుండెల్లోకట్టినా, గూళ్ళు తొలగాలి మనుషులెదగాలి
మనసులు, ఎదగాలి, మారాలి మనమంతా ॥మా॥

2. నడవాలి, నడవాలి, ముందుకు నడవాలి
మనమంత, నడవాలి, ముందుకు
సాగాలి, సాగాలి, ముందుకూసాగాలి
శక్తిసడలిన, మనజాతికి, చైతన్యంరావాలి,
మారాలి, నడవాలి, సాగాలి ॥మా॥

# "లోకమంత"

*రాగం-రంజని*

పల్లవి

"లోకమంత, ఒక, నాటకము
చేసేపనులన్నీ, బూటకము ॥లో॥

అ.ప॥ కట్టేది, కాషాయ వస్త్రము
పట్టేది, స్వార్థానికి ఛత్రము
త్రిప్పేది, రుద్రాక్షమాల
విప్పేది, ఉదరమునకు, పోషణ పంచాగం ॥లో॥

*చరణం బేహాగ్ రాగం*

1. తిరిగేది, పుణ్యక్షేత్రాలకు
మరిగేది, కామినీకనకసుఖాలకు
చెప్పేది, శ్రీరంగనీతులు,
చేసేవి, చెప్పరాని, చేతలు ॥లో॥

*హంసానంది రాగం*

2. విభూతినుదుట, చేతకమండలం
చంకన యోగదండం, తలపైన జటాజూటం,
ఆకారమపర, పరమేశ్వరునిది,
అవతార, మవనీతి పరునిది
అంతా ఒకనాటకం, అంతా ఒకబూటకం, ॥లో॥

# "ఒక పూవు"

రాగం - మోహన

పల్లవి

''ఒక పూవు, కాజాలదు, పూలమాల
ఒక మొక్కతోనేకాదు, పూతోట ॥ఒ॥

అ.ప॥ ఒక మనిషితోనేకాదు, జాతి
ఒక మాటపై నే కాదు, ప్రజాభిప్రాయం ॥ఒ॥

చరణములు :

మధ్యమకాలంలో

1. పువ్వులబట్టి, మాలలాగా
మొక్కలబట్టి, తోటలాగా,
మనుషులబట్టి, వుంటుంది దేశం
భాష, వేషం, కులం, మతం
భాషలెన్ని, మాట్లాడినా
భావం ఒక్కటే, ప్రజఒక్కటే
అన్నిభాషలు, అన్నిమతాలు, వర్ధిల్లాలి, దేశంలో ॥ఒ॥

2. ఎన్నో మొక్కలు, ఎన్నో పూవులు
తోటలో వెలసినట్లే, అన్నికులాలకు, అన్నిమతాలకు,
అర్థాలన్నీ ఒక్కటే,
ఉన్నత శిఖరాలందుకోను, దేవుడందరికొకడే
ఐకమత్యపునీతినిచ్చెనే, జాతిపుష్పపుతావి
మవదంతా, ఒకటే జాతి ॥ఒ॥

# "అందాల గోదావరి"

రాగం చారుకేశి

పల్లవి

"గోదావరి . . . . అందాల . . . గోదావరి
బంగారు గోదావరి,
గలగలపారేను, గోదావరి, మిలమిల
మెరిసేను, గోదావరి॥

అ.ప్ర॥ సరిగమ, పదనిస, సంగీతము
శృతికూర్చి పాడేను, గోదావరి,
గలగలపారేను, గోదావరి, మిలమిలమెరిసేను, గోదావరి ॥అం॥
ఆ ఒడ్డు నాతరులు
ఈ ఒడ్డునాగిరులు
అడగడు గనాసిరులు ॥అం॥

చరణములు

1. సరస కిన్నెరసాని, శబరి చెలిక త్తెగా
ఒయ్యారములతోడ, వెయ్యిమెలికలు తిరిగి,
గలగల పారేను, గోదావరి,
మిలమిల మెరిసేను, గోదావరి ॥అం॥

2. పాపికొండల నడుమ, పండు వెన్నెలలోన
పరవళ్ళుత్రొక్కేను, గోదావరి
మెండైన, అడవుల్లో, నిండుగాపారేను గోదావరి,
అందాల చిందులతో, అందరిని, మురిపించు, గోదావరి,
గలగల —— —— మిలమిల —— —— ॥అం॥

3. మోసాలు ఎరుగని, ద్వేషాలు పెంచని గోదావరి,
బంగారుపంటలే, పండించి, ప్రజలకన్నముపెట్టు గోదావరి
శ్రీలక్ష్మిగోదావరి —— ధూలక్ష్మి గోదావరి ——
అందాల గోదావరి, బంగారు గోదావరి——
గలగల —— —— మిలమిల —— —— ॥అం॥

# "ప్రొద్దున్నే లేస్తాడు"

*రాగం-మాండ్*

పల్లవి: ప్రొద్దున్నే లేస్తాడు, పొలానికెళ్తాడు
ఎద్దుల్ని, దున్నల్ని, నమ్ముకొని
మబ్బుల్ని, మట్టినీ, నమ్ముకొని
కాడి గడతాడు, మేడి పడతాడు
కష్టించి, భూమిని, సాగుచేస్తాడు ॥ప్రొ॥

చరణాలు

1. ఎరువుల కరువు, అప్పుల బరువు
ఈ ఏడతి వృష్టి, ఆ ఏడనా వృష్టి
ఏటేట, కష్టాలు, కరువుల బాధ
ఏర్వాక నుండి, ఏడాది పొడుగునా
రెక్కలకు లేదు, తీరిక క్షణం
ఒక్కనాడైన, నిండదు, డొక్క ॥ప్రొ॥

2. మట్టిలో, మణులు, పండిస్తాడని,
పరిశ్రమలకు, పట్టణాలకు, ప్రాణం, పోస్తాడని,
అంతా రైతుదే, రాజ్యమని, పొగడి అతణ్ణి ఉబ్బేస్తారు.
ఆయితే జీవితం
"ఈనగాచి నక్కల పాలయేరా" అతడి ఆదాయం
"ఎక్కడేసిన గొంగళక్కడేనని"
ఎవ్వరు, ఎరుగరు, ఎవరికి తెలియదు
వాడిగోడు, వాడిదేను ॥ప్రొ॥

3. అన్నీ సహిస్తూ, ఆశనే వరిస్తూ,
సాగిపోతూంటాడు, రైతురాజు
ఎప్పుడు బాగు, పడతాడో, చిక్కుల వల నేలా విప్పుతాడో
ఏదో ఒకరోజు రాదా, లేదా సంతోషం, రైతురాజుకు
॥ప్రా॥

# "పాటలే పాడనా"

రాగం-సామంతం తాళం-ఆది

(అయ్యప్ప స్వామి)

ప॥ పాటలే పాడనా, స్వామి, నీ
పాటలే పాడనా, పరవశముగ పాడనా
అయ్యప్ప, స్వామీ, నీ ॥పా॥

అ.ప॥ కలియుగమున, దేవా, అయ్యప్ప
శివ కేశవులకు, శిశువుగ జన్మించి
శబరిమలపై, వెలసిన స్వామి ॥పా॥

చ॥ జపమాల ధరియించి, నిష్టతో వ్రతమొనర్చి
ఇరుముడి తలకెత్తి, కోనలన్నిదాటి
తాళ్ళనక, ముండ్లనక, కండ్లారకన్నాము
పాలాభిషేకమిదె, కర్పూరహారతిదె
గైకొని మమ్ముల, కాపాడు మాస్వామి

(మధ్యమకాలం)

మ.కా. ఆనందముతో, మైమరిచి
ఆలపించనా, గానమే స్వామి ॥పా॥

# "హరి హర పుత్ర"

*రాగం-రేవతి తాళం-ఆది*

ప॥ హరిహర పుత్ర, అయ్యప్ప
ఎరుమేలి వాసా, మమ్మేలు ఈశా ॥హ॥

అ.ప॥ శబరి మలవాసా, శరణం దేవా
ఐదుకొండలనాథా, అనుగ్రహప్రదాతా
అనాధరక్షక, ఆపద్బాంధవ
అయ్యప్ప శరణం, స్వామి శరణం ॥హ॥

*చరణము*

భూతానాథా, భూపాలా, ఇరుముడిదాతా ఈశ్వర తనయా,
ఉపవాసనేతా, ఉమాసుపుత్ర, శక్తిరూపా యుక్తిదాతా
అయ్యప్ప శరణం, స్వామి శరణం ॥హ॥

చ. 2. పంపాస్నానం, పావనం, స్వామిపాదం సోపానం
మోహినిపుత్ర అయ్యప్ప, మోహనరూప అయ్యప్ప
శాంతికిమూలం అయ్యప్ప, కాంతికి నిలయం అయ్యప్ప
భక్తుల బ్రోవుము అయ్యప్ప, బాధలు తీర్చుము అయ్యప్ప
చేదుకో కొండకు, అయ్యప్పా
చేర్చుకోదరికి, అయ్యప్పా
స్వామిశరణం, అయ్యప్పా, శరణం అయ్యప్పా
శరణం, అయ్యప్పా, శరణం, అయ్యప్పా ॥హ॥

# "శివుడే మంచి దేవుడయా"

రాగం చక్రవాకం, తాళం ఆది

ప॥ శివుడే మంచి, దేవుడయా, శ్రీశైల శిఖరవాసుడయా

అ.ప॥ శంభోశంకర, ఈశుడయా, పాపవిమోచన దేవుడయా ॥శి॥

చరణములు

1. పార్వతినేలిన, పురుషుడయా, గణపతిదేవుని, పితురుడయా,
మదనుని కాల్చిన, దేవుడయా, విషమునుమింగిన,
ఈశుడయా ॥శి॥

2. లింగరూపుడైన, జంగమయా, నింగికినేలకు, ప్రాణమయా
గంగను నేలకు, దింపినవాడయా, బెంగలు
బాపిన దేవుడయా ॥శి॥

3. శివుని గొల్చిన, సేకురు మోక్షము, శంకరుగొల్చిన
సమకూరు, సేమము
ఈశఅంటే, కాసునయా, శంకరఅంటే శమించునయ్యా
దేవదేవుడు, ఇతడేనయ్యా, అందరిదైవము ఇతడేనయ్యా ॥శి॥

# " శ్రీశైలవాసా "

రాగం ఖరహరప్రియ, తాళం ఆది

ప॥ శ్రీశైలవాసా, శివలింగరూపా, కైలాసవాసా, జగదీశా॥శ్రీ॥

అ.ప॥ ముక్కంటి నీకే, మ్రొక్కితిమయ్యా, ఎక్కడున్నా
నిన్నే నమ్ముకొంటిమయ్యా ॥శ్రీ॥

చరణములు

1. హాలహాలమే, తాగినావు, కోలాహాలమే, అణచినావు
పులిచర్మమేనీ, వస్త్రధారణ, నీలకంఠ, నిత్యానందా ॥శ్రీ॥

2. నాగేంద్రుడేని, కంఠహారము, నందీశ్వరుడేనీ
ప్రియవాహానము
విభూతియేనీ, మైపూత, లింగస్వరూపా జంగమయా ॥శ్రీ॥

3. లోకాల నేలు, పరమేశ, పాపాల దునుము మహేశ
నింగికి నేలకు, నీవే మూలము, త్రిపురహారా
త్రిగుణాతీత ॥శ్రీ॥

# జయ జయ శంభో

రాగం-వలజి, తాళం-ఆది

ప॥ జయ జయ శంభో సర్వేశ, జయసృష్టి స్థితిలయకారా
జయదుష్ట జనభయంకరా, జయమాంపాహి శివశంకరా ॥జ॥

అ.ప॥ దివ్యశరీర, దీనబాంధవా, నాగభూషణా నమామి నమామి ॥జ॥

చరణములు

1. పాశుపతం, పట్టినావు, పశుపతిగా, వెలసినావు
కామదహనం, చేసినావు, పార్వతీచేయి, పట్టినావు
కైలాస శిఖరం ఎక్కినావు, లోకాలనెల్ల నేలినావు ॥జ॥

2. త్రిశూలమునీకు పూతకర్ర, కపాలము నీకు చేతిబుర్ర
వరప్రదాతా, పరమ పూరుషా,నీనామయం అనుపమానం
నీరూపమతిమనోహరం, నీపాదపద్మం, పూజనీయం
నీనామ స్మరణం, పుణ్యప్రదం ॥జ॥

3. ఇహలోకపు, బాధల్లో, చిక్కుకొని యున్నాము
పాపపంకిలములలో, తగులుకొనిపోతున్నాము
దండమిదె గైకొనుస్వామి, దాస్యవిముక్తిచేయుముస్వామి
అన్యునిగా నను, భావించకుమీ, ధన్యునిగానను చేయుము ॥జ॥

# ఆది శక్తి అంబపరాశక్తి

*రాగం-హంసానంది,* **తాళం-ఆది**

ప॥ ఆది శక్తి అంబ, అపర పరాశక్తి
ఏది దిక్కుమాకు, నీవు వినా అంబ ॥ఆ॥

అ.ప॥ అమర మూర్తివి నీవే, అభయమొసగవే
అమ్మలందరికి, అమ్మవునీవే, అంబ ॥ఆ॥

చరణములు

ముల్లోకాలకు, మూలము నీవే
ఎల్లజగాలను, చల్లగజూచే
తల్లివి నీవే, లోక శక్తివి నీవే
లోకేశ్వరుని, పత్నివి నీవే, అంబ ॥ఆ॥

2. కంచి కామాక్షిని నినుగొల్వ
కాశి విశాలాక్షిని, నినువేడ
మధుర మీనాక్షిని నినుపొగడ
ఏడు జగాలకు, తోడునీడ
మానవజాతికి మనుగడనీవే
జీవకోటికి, ప్రగతివి నీవే
ముల్లోకాలకు మూలము నీవే
వేదాలలో నాదము నీవే
పేదలపాలిటి తల్లివినీవే
అపరశక్తివి నీవేజననీ
నీవే నీవే, అంబ, పరాశక్తి ॥ఆ॥

# "పార్వతీపుత్రా"

రాగం-భౌళి

ప॥ పార్వతి పుత్ర, గణేశా, పాప వినాశా
పవిత్రమూర్తి ॥పా॥

అ. ప॥ మూషిక వాహన, దోషాప హారణ
ఆది నమస్కారం, అందుకో దేవా ॥పా॥

చరణం॥

అన్ని కార్యములకు, నిన్నే కొలుతుము
పార్వతి తనయా, పాప సంహారా,
అన్నియు నీవే దేవా, దోషములన్ని
తొలిగించుము, విజయం మాకు చేకూర్చుము ॥పా॥

# "కరుణామయుడు"

*రాగం-సింధుభైరవి*

ప॥ కరుణామయుడు, ఏసు ప్రభువు
కారుణమడుగడు, కరుణకు తాను॥

అ. ప॥ నరులను బ్రోవగ, వెలసినాడు
పరితపించు, పాపుల మన్నించు॥ ॥క॥

*చరణాలు*

1. ప్రజలగాచే ప్రవక్త అతడు
సుజనుల. దుర్జనుల, సమముగ బ్రోచు
పాపులకై తన,ప్రాణములిచ్చే
మనకొరకై తాను, మరణమునొందే ॥క॥

2. ధనికులు, పేదలనే, తేడా లేదు
మనుషులందరిని, సమముగ జూచు
నమ్మకద్రోహిని, నమ్మిన ఘనుడు
కమ్మని హృదయము, ఏసు ప్రభువుది
నమ్ముగాదతని, నమ్మిన వారికి
సమ్మతితో అందరిని, దరిజేర్చి బ్రోచు ॥క॥

# "ఎవరో-ఎవరో"

*రాగం-శుభపంతువరాళి*

ప॥ ఎవరో, ఎవరో, ఎవరో, నీ వెవరో,
చల్లగవీచే, గాలివి నీవా, పెనుగాలిలో
బలము నీవా, వడగాలిలో, వేడివి నీవా,
ఎవరో - నీ వెవరో, ఎవరో, ఎవరో ఎవరో॥

*చరములు:*

1. కనువిప్పే శిశువును నేను, వికసించే, మొగ్గను నేను,
మబ్బుల్లో, మెరుపును నేను, పూవుల్లో తావిని నేను,
జగానికి, ఉనికిని నేను, ప్రగతికి, ప్రాణం నేను,
నింగికి, నేలకు, నిచ్చెన నేను, గిరులకు, తరులకు
పచ్చదనం, నేను, నేను, నేను, నేను, నేను, ॥ఎ॥

2. ఆకాశం, ఎత్తును నేను, సాగరపు, లోతును నేను
సరిగమల, సంగీతము నేను, అప్సరల
నాట్యం నేను, హంస నడకల, అందం నేను
ఎగిరేపక్షి వేగం నేను, రామచిలుకల, పలుకును నేను
ఆడవినదర్చే, సింహ, గర్జన నేను,
నేను, నేను, నేను, నేను॥ ॥ఎ॥

౩. కైలాస శిఖరం, ఉన్నతి నేను, కన్యాకుమారి, అగ్రం నేను
సుఖాన్నిపంచే, పవిత్రమూర్తిని, శాంతిని కూర్చే స్వర్గంనేను
(మనిషీ, మమతా) మనిషీ, మమతలో పెరిగే మమతను నేను
మానవక్షేమం కోరే, ప్రేమమూర్తిని, నేను
నేను, నేను, నేను, నేను, ప్రకృతి మూర్తిని నేను ||౨||

# "ఎందుకయ్యా వెంకటేశా"

రాగం-హిందూళ

పల్లవి

"ఎందుకయా, శ్రీ వేంకటేశ [కోప]
మెందుకయా, శ్రీనివాసా ॥ఎం॥

అ,ప॥ కామితార్థము, కోరలేదే, పాపమేమి చేయలేదే
పుట్టినప్పుడే, కూవలందరికి, పెట్టినామే, నీ, పేరులన్నీ ॥ఎం॥

చరణములు:-

1. కొలువు సేయుటలో, దోసములున్నా
కోపము సేయకు, ఓ గోవిందా
శ్రీనివాసా, చిద్విలాసా, కరుణజూపవా,
తిరుమలేశ, శరణు వేడితిమయ్యా ॥ఎం॥

2. ఎన్నడు నిన్ను, మరువము దేవా, నిన్నే కొలుతుము, నిజ
ముగ, దేవా,
దీనులపాలిట, దేవుడయ్యా, దిగిరావా, మము, బ్రోవవా
॥ఎం॥

మధ్యమకాలం:

4. కలియుగమున, వెలసిన దేవా,

పలువిధముల నిను, గొలుతుమయా

ఎక్కితిమయ్యా, ఏడుకొండలు,

మొక్కితిమయ్యా, మనసారా

తలనీలాలు, నిలువుదోపిడి, పదిలముగా, నీ కొసగుదుమయ్యా

దీనులపాలిటి, ఓ దేవా, దిగిరావయ్యా మముగావా,

దిగిరావయ్యా, మముబ్రోవ ॥ఏం॥

# "దీపము చిన్నదైనా"

*రాగం:-శుద్ధధన్యాసి*

ప॥ దీపము చిన్నదైనా, తరిమేస్తుంది
చీకటినైనా, కారు, చీకటినైనా

అ॥ ప॥ విద్య అనే దివ్వెను, వెలిగించుకుంటే
అజ్ఞానమదే, మాయమౌతుంది ॥దీ॥

*చరణములు*

1 బాలల, హృదయాల్లో, తెలివి తేటలను,
చదువుల పువ్వులను, వికసింపనేద్దాం,
దీపాల్లా వెలిగిద్దాం ॥దీ॥

2. దూరంగా, తరిమేద్దాం, అందరి, మందబుద్ధులను,
ప్రతి దివ్వెమారాలి, ఒక దివ్య జ్యోతిగా,
ప్రతి పాప మారాలి ,ప్రజోపకారిగా ॥దీ॥

# "నవ్వు"

*రాగం-కల్యాణి*

పల్లవి

నవ్వు, నవ్వు, నవ్వు, పువ్వులాంటిది

అ. ప॥ అందాన్ని, అందిస్తూ, ఆనందమే వెదజల్లుతు

అందరిని, ఆకర్షించే ॥న॥

*చరణములు*

1. బాలుర నవ్వులు, బారులు తీరిన, బంతి పువ్వులు,

బాలల నవ్వులు, పసిడి రంగుల, చేమంతి పువ్వులు,

బాలబాలికల, నవ్వులు, పరిమళాలు, వెదజల్లే, పూబంతులు

॥న॥

2. తోటివారి, బాధలుచూచి, నవ్వితే

నవ్వుకాదది, నాగుపాము విషం

పేదల, బాధలుచూచి నవ్వితే

నవ్వుకాదది, విషము, చిలికించు, వికృతం.

నలుగురి సుఖాన్ని, పంచుకోవడం, నలుగుర్ని, నవ్వించడం,

నవ్వులోని అందం ॥న॥

3. చందమామలాంటి, పిల్లల ముఖాలు, చల్లని నవ్వులు
వెన్నెలలాంటి, వాళ్ళనవ్వులు, వెన్నెల పువ్వులు
మనుషుల, హృదయాలను, నవ్విస్తుంది, నవ్వుముఖం
మందారాలుగా, మారుస్తుంది, మధురమైన, దరహాసం ||న||

3. చందమామలాంటి, పిల్లల ముఖాలు, చల్లని నవ్వులు
వెన్నెలలాంటి, వాళ్ళనవ్వులు, వెన్నెల పువ్వులు
మనుషుల, హృదయాలను, నవ్విస్తుంది, నవ్వుముఖం
మందారాలుగా, మారుస్తుంది, మధురమైన, దరహాసం ||న||

# "సంక్రాంతి"

రాగం-ఆరభి

పల్లవి

వస్తుంది సంక్రాంతి తెస్తుంది క్రాంతి
ఇస్తుంది అందరికి సంతోష సంపదలు ॥వ॥

చరణాలు

2. కడతారు బంతిపూల తోరణాలు
వేస్తారు ముగ్గులు రంగు రంగులుగా
పిలుస్తారు అల్లుళ్ళు కూతళ్ళను
కొత్తబట్టలు కట్టి పిండివంటలు చేసి
పలువిధాల సంబంరాలు, జరుపుతారు ॥వ॥

2. పశువులకు చేస్తారు అలంకరణలు
బళ్ళకు నాగళ్ళకు చేస్తారు పూజలు
కర్షకుల పాత్రలను నింపి
కార్మికుల కడ గండ్ల ద్రోలి
ప్రజలకు ఉత్సాహం కలిగించి
ఏటేటా తెలుగు నాట
వెలుగు సంక్రాంతి ॥వ॥

# "సంక్రాంతి"

రాగం-ఆరభి

పల్లవి

వస్తుంది సంక్రాంతి తెస్తుంది క్రాంతి
ఇస్తుంది అందరికి సంతోష సంపదలు

చరణాలు

2. కడతారు బంతిపూల తోరణాలు
వేస్తారు ముగ్గులు రంగు రంగులుగా
పిలుస్తారు అల్లుళ్ళు కూతళ్ళను
కొత్తబట్టలు కట్టి పిండివంటలు చేసి
పలువిధాల సంబంరాలు, జరుపుతారు

2. పశువులకు చేస్తారు అలంకరణలు
బళ్ళకు నాగళ్ళకు చేస్తారు పూజలు
కర్షకుల పాత్రలను నింపి
కార్మికుల కడ గండ్ల ద్రోలి
ప్రజలకు ఉత్సాహం కలిగించి
ఏటేటా తెలుగు నాట
వెలుగు సంక్రాంతి

# ఏలేది గోలుకొండ

(గోల్కొండ నవాబు దర్బారు నాట్యకత్తె పాట)

ఏలేది గోలుకొండ
ఎగిరేది తెలుగు జెండా
లేడు లేడు నీకు సాటినవాబు
లేనేలేదు నీ మాటకు జవాబు ॥ఏలేది ॥

ముసి ముసి నవ్వుల మూసీనదితో
గుసగుసలాడే దెందుకో . . .
తెలుగు కోరికలకు భాగ్యనగరమై
వెలుగులు పండేటందుకు . . . ॥లేడు॥

తానీషా చూసాడు నన్నీరోజు
తరుముతున్నాడు నన్నే మొ వలరాజు
పైటకొంగు జారుతున్నది
పరువము తొంగి చూస్తున్నదీ . . . ॥లేడు॥

వంగి వంగి సలాముచేసే కరాలు
పొంగి పొంగి నిన్ను చూసే నేత్రాలు
ప్రణయదేవతచేసే కైవారాలు
అల్లా రసూల్ నాకిచ్చిన వరాలు ॥లేడు॥

# ఏలేది గోలుకొండ

(గోల్కొండ నవాబు దర్బారు నాట్యకత్తె పాట)

ఏలేది గోలుకొండ
ఎగిరేది తెలుగు జెండా
లేదు లేదు నీకు సాటినవాబు
లేనేలేదు నీ మాటకు జవాబు ॥ఏలేది ॥

ముసి ముసి నవ్వుల మూసీనదితో
గుసగుసలాడే దెందుకో . . .
తెలుగు కోరికలకు భాగ్యనగరమై
వెలుగులు పండేటందుకు . . . ॥లేదు॥

తానీషా చూసాడు నన్నిరోజు
తరుముతున్నాడు నన్నేమొ వలరాజు
పైటకొంగు జారుతున్నది
పరువము తొంగి చూస్తున్నదీ . . . ॥లేదు॥

వంగి వంగి సలాముచేసే కరాలు
పొంగి పొంగి నిన్ను చూసే నేత్రాలు
ప్రణయదేవత చేసే కైవారాలు
అల్లా రసూల్ నాకిచ్చిన వరాలు ॥లేదు॥

# ఘుమ్మని వెదజల్లే తెల్లని పూలు

ఘుమ్మని వెదజల్లే తెల్లనిపూలు
రమ్మని గుసగుసలాడే చల్లనిగాలి
నను చేరుమా నను కోరుమా
తాజా కలువల కనుదోయి
రోజా పువ్వుల చెక్కిళ్లు
ఉండి ఉండని దుస్తుల్లో
ఉలిక్కిపడే (అబ్బ ఉలిక్కిపడే) పరువాలు ॥ఘుమ్మని॥

మెండుగ విరిసే హృదయంలో
గుండెలు అదిరే పరువాలు
అందాలొలికే చందురుడు
హాయిని గొలిపే పున్నమరేయి
వలపులు కురిపించే విరిపూసిన వెన్నెల
తలపులు మొలికించే తరుణవయసు ॥ఘుమ్మని॥

కనువిప్పి చూసుకో
మనసిప్పి (నీదాన్ని) చేసుకో
అంతా నీ స్వంతం
ఎంతో మనకానందం ॥ఘుమ్మని॥

# ఘుమ్మని వెదజల్లే తెల్లని పూలు

ఘుమ్మని వెదజల్లే తెల్లనిపూలు
రమ్మని గుసగుసలాడే చల్లనిగాలి
నను చేరుమా నను కోరుమా
తాజా కలువల కనుదోయి
రోజా పువ్వుల చెక్కిళ్లు
ఉండి ఉండని దుస్తుల్లో
ఉలిక్కిపడే (అబ్బ ఉలిక్కిపడే) పరువాలు ॥ఘుమ్మని॥

మెండుగ విరిసే హృదయంలో
గుండెలు అదిరే పరువాలు
అందాలొలికే చందురుడు
హాయిని గొలిపే పున్నమరేయి
వలపులు కురిపించే విరిపూసిన వెన్నెల
తలపులు మొలికించే తరుణవయసు ॥ఘుమ్మని॥

కనువిప్పి చూసుకో
మనసిప్పి (నీదాన్ని) చేసుకో
అంతా నీ స్వంతం
ఎంతో మనకానందం ॥ఘుమ్మని॥

పశులతో పాడుతారు కొండవాళ్ళు
కారడవుల్లో కాపురాలు కొండవాళ్లకు
మిన్నుకు మిన్నుకు మధ్యన జీవిస్తారు
నాటి మనిషికి దగ్గరగా
నేటి సంఘానికి దూరంగా
రాజకీయాలు, రణాలులేని అడవుల్లో
బ్రతుకుతున్నారు కొండవాళ్లు ॥కొండ॥

# అప్సర నేను

ఆమె॥ అప్సర నేను
అమరడ నీవు.

అత॥ కమలము నీవు
భాను కిరణము నేను

ఆ॥ చంద్రుడుడ నీవు
చకోరపక్షిని నేను.

అ॥ మేఘము నేను
మెరుపువు నీవు.

ఆ॥ ఇంద్రుడ నీవు
(రంభను) మేనక నేను

అ॥ వెలుగును నేను
కాంతివి నీవు.
రమణివి నీవు
రమ్యం నేను

అబలవు నీవు
సబలడ నేను
శక్తివి నీవు
ఈశుడ నేను

రాగము నేను
సృతితాళం నీవు
సంగీతము నీవు
సాహిత్యము నేను

సరిగమ సారం నీవు
పరిమళ కావ్యం నేను
అక్షర అర్థము నీవు
పుస్తక రూపం నేను.

# మధువులో వుంది మధురం

మధువులో వుంది మధురం
మనసులో వుంది కథనం
ప్రేమలో వుంది ప్రణయం
చిరునవ్వు సిగ్గులో వుంది శృంగారం

ఆకారంలో వుంది అందం
అందంలో వుంది ఆనందం
ప్రియురాలి హృదయంలో వుంది
అనురాగ రేఖల కుసుమం
గులాబి పువ్వుల మధురం
చెలి కౌగిటిలో వుంది
ఎనలేని మమకారం
చెలి అధరంలో వుంది
మధురాతి మధురం
చెలి చెక్కిలో వుంది
చిక్కని జుంటి తేనె
చిలుక పలుకుల చందం
హంస నడకల అందం
కోకిల గానం మయూర నాట్యం

# నవ్వు - నవ్వించు

నవ్వు నవ్వించు లోకాన్ని
నవ్వులతో కవ్వించు నాకాన్ని
నవ్వులో ఉంది అందం
ఆ నవ్వులోనే ఉంది ఆనందం ॥న॥

నవ్వే వెన్నెలకు మూలం
(అ)నవ్వే చీకటికి శూలం
నవ్వే నవనందనం-
నవ్వే దివ్యౌషధం- ॥న॥

నవ్వులే ప్రాణాలు పోస్తాయి
నవ్వులే [ఎన్నో] ప్రాణాలు తీస్తాయి
విషము చిలికించు నవ్వులు
విరులు కురిపించు నవ్వులు ॥న॥

నవ్వులు వెన్నెల పువ్వులై
స్నేహపు కాంతుల దివ్వెలై
లోకంలో వెలుగుతుంటే
శోకమే దూరమగునోయీ ॥న॥

# మూఢనమ్మకాలు

నమ్మరాదు పిల్లలు మూఢనమ్మకాలు
అసలు విషయం అర్థంచేసుకోవాలి
పిల్లినడకలకు, బల్లిపలుకులకు
నక్క ఎదురుకు, కాకి ఎగురుకు
మన కార్యాలకు వాటితో లేదు సంబంధం
బోడితలలకు మోకాళ్ళకు ముడులు వేయడంతప్పు
పిల్లలకు నవ్వులే పువ్వులనీ
వాళ్ళమాటలే మాణిక్యాలనీ

తెలుసుకున్న పెద్దలు
ఉంచరు పిల్లలను
''వద్దు, వద్దుల'' హద్దుల్లో-
భావిభారతపు రథసారధులుగా
దేశానికి పునాదులునీ-
సమాజంలో సమానులునీ-
పెంచాలి పెద్దలు, వారిని
బడిలో పంతులు
ఇంట్లో అమ్మా, నాన్న
''ఇది కాదు, అది వద్దు'' అంటూ

అసల్లోనే వాళ్ళ ఆసక్తిని తుంచేస్తే,
ప్రశ్నలకు బదులు చెప్పకుంటే
"బల్ల ఎక్కు" మంటే
బాలలు బాగుపడేదెలాగు
భారతజాతికి పునాదులయ్యేదెలాగు
జాతికి నేతలయ్యే దెలాగు?

# అందాలొలికించే

అతడు: అందాలొలికించే నీ సొగసు
వంతులువేసే నీ వయసు
పందెమువేసి నను పులకరించు

ఆమె : ముందుకుదూకే నీసొగసు
గంతులు వేసే నీవయసు
ఎందుకో నను మురిపించు

అ. ఆటలు ఆడే నీసొగసు
పాటలుపాడే నీహొయలు
తటపటజేయును నామనసు

ఆ. కవ్వించే నీవయసు
నవ్వించే నీసొగసు
కోరికలూరించు
ఆశలు పెరిగించు

అ. మనసునుదోచే నీవలపు
ప్రేమను దాచే నీహృదయం
అందాలనుపండించు
ఆనందాలను గొలిపించు

ఆ. నాకన్నె వయసు
నీవన్నె సొగసు
పున్నమిరాత్రిరి
వెన్నెలరేయి హాయి, హాయి

# లోకం తీరు

లోకం తీరు
భూలోకపు మర్మం
కనరా ఓరన్నా
వినరాఓరన్నా

లోకమే (అంతా) ఒక బూటకమన్నా
లోకులాడేదొక నాటకమన్నా
రంగులు పూసేరన్నా
వర్ణము మార్చేరన్నా

చూపే నమూనా ఒకటీ
అమ్మే సరుకు మరొకటి
వాడ వాడల వారకాంతలన్నా
పడుపు వృత్తికే భంగము ఓరన్నా

వేపనాటితే చింత మొలుచునా
పాపం విత్తితే పుణ్యం పండునా ॥ఓరన్నా॥
సారా హెచ్చెను
కాఫీకొచ్చెను ముప్పు

వయసు ముదిరినా
వగరు చచ్చునా అన్నా ఓరన్నా

ఈ లోకపు తీరుతెన్నులు
తెలియుట దుర్లభమన్నా, ఓరన్నా

పూసేది విభూతి
పట్టేది కమండలం
కట్టేది కాషాయవస్త్రం
వేసేది టోపి
పెట్టేది నామం ॥అన్నా ఈలోకం తీరు॥

ముంచేది నది ఏటిలో
ఎంచేది రుద్రాక్షమాల
పంచేది పసుపు కుంకుమ
తుంచేది మెడలోతాడు
చూసేది పుణ్యక్షేత్రాలు
చేసేది పచ్చి మోసాలుఅన్నా ॥అన్నా॥

# అయ్యామ్ సిక్స్‌టీన్

అయ్యామ్ సిక్స్‌టీన్
గోయింగాన్ సెవెన్‌టీన్
గడిచింది పదహారు
నడిచేది పదిహేడు
పదహారు నిండేను
పడుచుదనం పెరిగేను
పావడా తరిగేను
పమిటకు సిగ్గులు మొలిచెను। ॥గడిచింది॥

నిన్నే నీరూపే చూడాలని
మనసారా నీపాటే వినాలని
కలవర పడునా మనసు
కదలి నడచు నీ వయసు- ॥గడిచింది॥

పదహారులో నీ పడుచుదదం
పదిహేడులోనీ గడుసుదనం
పదహారులో నీ ఉడుకుదనం
పదిహేడులో నీ దుడుకుదనం
నీ కోరచూపులో కొంటెదనం ॥గడిచింది॥

నీ ఓర చూపులో ఒయ్యారం
నీ రోజా బుగ్గల సిగ్గుతనం
నీ తాజా మగసిరి కోడెతనం
(మన) మేనులు పులకిస్తున్నాయి

(మన) మనసులు వికసిస్తున్నాయి
కిల కిలా నవ్వుదాం
మిల మిలా మెరుద్దాం
కిల కిలా – మిల మిలా
నవ్వుదాం–మెరుద్దాం

# ఈ రాత్రికి నే వస్తే

రమణి ముద్దుల గుమ్మ
రంగు చీరల బొమ్మ
రాత్రికి, ఈ రాత్రికి
నేవస్తే, నువ్వుంటావా
(మరి) ఏదైనా ఒంక పెట్టి
పోమ్మంటావా ॥రాత్రికి॥

కళ్ళకు కాటుక పెట్టుకొని
బుగ్గకు చుక్క దిద్దుకొని
తలలో పువ్వులు ముడుచుకొని
తలుపులు వారగ వేసుకొని
తలపులు నాపైనే ఉంచుకోని
నువ్వుంటావా, రాత్రికి నేవస్తా
మరి ఏదైన వంక పెట్టి పోమ్మంటావా ॥రాత్రికి॥

కన్నులు అరమోడ్చుకోని
కలలో నన్నే తలుచు కోని
హృదయంనాపై ఉంచుకోని
రమణీ నాకై నువు కాచుకోని
ఉంటావా ఈ రాత్రికి నే వస్తే

నువ్వంటావా, ఏదేనా ఒంక పెట్టి
మరి పోమ్మంటావా ? ||రాత్రికి||

ఘుమ్మని అత్తరు పూసుకోని
కమ్మని కారాకిల్లీ వేసుకోని
నువ్వంటావా నే వస్తే ఈ రాత్రికి
మరి ఏదైన ఒంక పెట్టి పోమ్మంటావా |రాత్రికి||

# సెలయేరు

గలగల పారేను సెలయేరు
మిలమిలా మెరిసేను సెలయేరు
గలగల మిలమిలా
పారేను, మెరిసేను సెలయేరు ॥గల॥

సరిగమ పదనిస సంగీతం
శృతి తప్పక పాడేను సెలయేరు
కొండలకు భయ పడక
కోనలకు బెదరక
నిండుగా పారేను సెలయేరు
మెండుగా కదలేను సెలయేరు ॥గల॥

పక్షులైనా పశువులైనా
మనుష్యులైనా మాకులైనా
పక్షపాతం లేని సెలయేరు
వేసట ఎరుగని సెలయేరు
ద్వేషం తెలియని సెలయేరు ॥గల॥

అందాలొలికించే సెలయేరు
అందరిని దరిజేర్చే సెలయేరు
గుండెవిప్పి ఆడుకునే సెలయేరు
దుండగాల నెరుగని సెలయేరు ॥గల॥

# ఎవరో ఆ చిన్నదీ

ఎవరో ఆ చిన్నదీ
ఎందుకో అదోలా గున్నదీ
ఎంతో అందాన్ని
చింపిరి పాతల్లో దాచుకున్నదీ
పూవులా గున్నదీ
పూరి గుడిసెలో ఉంటున్నదీ
ఎవరో ఆ చిన్నదీ, అందాల కన్నెదీ ॥ఎవరో॥

వెన్నెలలా గున్నది
ఎండలో పోతున్నదీ
గులాబీలాంటి చెక్కిళ్లు
ఉడకివాడి పోతున్నవి ॥ఎవరో॥

చింతలతో వంతలతో
చిక్కి పోతున్న ఆ చక్కని చిన్నదీ
అనుమానం ఎందుకు
ఆమెపేరే దారుద్ర్యం
ఆమె పేదరికం ॥ఎవరో॥

# అందాలొలికించే - హైదరాబాద్

బాబు ఇది హైదరాబాద్
ఇది కట్టింది ఓ పెద్ద నవాబు
లేదు దీనికి సాటినగరం వేరేది
కాదు సమానం దీనికి ఇంకేది ॥బాబు॥

అటు హైదరాబాదు
ఇటు సికింద్రాబాదు
రెంటికి మధ్య
గుసగుసలాడే హుస్సేన్‌సాగర్ ॥బాబు॥

తారలతో సరసాలాడే చార్‌మినార్
సినీతారలతో తళ తళలాడే చిత్రవిహార్
రంగు రంగుల పూసలతో
రతనాల గాజులతో
డెందాలకు బందాలేసే
అందమైన లాడ్‌బజార్ ॥బాబు॥

ముసి ముసి నవ్వుల మూసీఒడ్డున
రిట్టులు వేస్తే గట్టుకుచేర్చే హైకోర్టట్
తీరిక సమయం జోరుగ గడపాలంటే
మరి గండిపేట ఉండనే ఉందీ ॥బాబు॥

ధగధగ మెరిసే మధుర మధుర పానశాలల్లో
వగలమారి వనితల వయ్యారాలు
మరులుగొలిపే, మగువల సయ్యాటలు
ప్రణయ విలాసాలకు పబ్లికు గార్డెన్
ప్రజల విలాపాలకు విధానసౌధం
అందాలకు చిందులుదొక్కే ఆబిద్‌రోడ్
సురలకు మరులుగొలిపే సుల్తాన్‌బజార్
గరీబులుండే అమీర్‌పేట
అమీర్‌లుండే గరీబ్‌నగరు ॥బాలు॥

అందాలొలికించె
బృందావన మీ హైదరాబాద్
ఆనందాలందించే
నందనవనమే హైదరబాద్ ॥బాలు॥

# నమ్ముతాను నేను

ప్రతి వర్షపు బిందువుకు
ప్రకృతి శోభిస్తుందని
ప్రతి చల్లని పిల్లగాలికి
పువ్వులు పులకరిస్తాయని
నమ్ముతాను నేను
వమ్ముగాదు నా నమ్మకము॥

ప్రతి చీకటి రాత్రికి
ప్రమిద ఒకటి దొరుకుతుందనీ
ప్రతి ప్రయత్నానికి
ఫలితం కొంత తక్కుతుందనీ ॥నమ్ము॥

నేటి కార్యం నెరవేర్చడం
రేపటి చర్యకు పునాది అనీ
మానవశక్తి వినియోగిస్తే
మంచి ఎంతైనా చేయవచ్చనీ ॥నమ్ము॥

నమ్మకంలో ఉంది శక్తి అని
నమ్మకంలో వికసిస్తుంది జీవితం అని
నమ్ముతాను నేను
వమ్ముగాదు నా నమ్మకము ॥నమ్ము॥

# వెలుతురపూవులు

వెలుతురు పూవులు విరియునులే
చీకటి గుంపులు చెదరునులే
సమసమాజం సమకూరునులే
సామ్యవాదము చేకూరునులే
ఉన్నవారిదే కాదులే పెద్దరికం
పేదలకు ఉన్నదిలే సగభాగం ॥వెలు॥

కలిమిలేములు ఏకముకాక మానవులే
ఊరందరికీ అధికారం దక్కునులే
పేదల ఆశలు చిగురించునులే
పెద్దలు బుద్దులు మారుసులే॥ ॥వెలు॥

మనుషుల మమతలే నిలుచునులే
శాంతి సుఖములే వెలయునులే
వెలుతురు పూవులు విరియునులే
చీకటి గుంపులు చెదరునులే ॥వెలు॥

# కొనడానికి సాధ్యముకానిది

ఏమిటదీ, ఏమిటదీ
కొనడానికి సాధ్యం కానిది
అమ్మడానికి అసలే వీలులేనిది ॥ఏమిటదీ, ఏమిటదీ॥

స్నేహమదీ, ప్రాణస్నేహమదీ
జీవితాలను పెనవేసేది
ద్వేషాలను తుంచేసేది
అందాలను అందించేది
అంతరంగంలో చోటుచూపేది
కోపతాపాలను తరిమేసేది
అనుబంధం, అదే తీరని అనుబంధం ॥ఏమిటదీ, ఏమిటదీ॥

పూవుల్లో తావి లాంటిది
మబ్బుల్లో మెరుపులాంటిది
మనసు మనసులో మమతను పెంచి
మనిషి జీవితం స్వర్గంచేసేది ॥ఏమిటదీ, ఏమిటదీ॥

రాగమద్ది, అనురాగమదీ
పంతులు లేకుండానే పాఠం నేర్పేది
హద్దులు దాటి ప్రవహించేది
అన్నివేళలా అమృతం కురిపించేది ॥ఏమిటదీ, ఏమిటదీ॥
అమృత ప్రేమేఅది, పవిత్రప్రేమే అది
అన్నిటినీ వీటన్నిటినీ
కలిపితే అయ్యేదేమిటదీ ॥ఏమిటదీ, ఏమీటదీ॥

మానవతా, అదే మనిషిని పెంచే
మనసును ఇనుమడించే మానవతా
ఆనందమయం అదీ
అనురాగమయం అదీ. ॥ఏమీటదీ, ఏమిటదీ॥

# చలువ చీర కట్టుకొని

చలువచీర కట్టుకొని
కలువపూల రవికె తొడిగి
కడవ సంకన పెట్టుకొని
చెరువు గట్టునకు వెళ్ళుతుంటే
మల్లెపూల వానకురిసె
చలువచీర సగము తడిసె

॥చలువ॥

కంచిపట్టు చీరకట్టి
మంచిరంగు రవిక తొడగి
మంచినీటికి వెళ్ళుతుంటె
పైరగాలి వీచినాది
పైటకొంగు లేచినాది॥

॥చలువ॥

మంచి గంధం పూసుకొని
మల్లెపూలు తురుముకొని
వళ్ళుసోకు చేసుకొని
ఇల్లువదలి వెళ్ళుతుంటె
పిల్లగాలి వీచినాది
మంచి గంధం కారిపోయె
మల్లెపూలు రాలిపోయె॥

॥చలువ॥

# ఒప్పులకుప్పా - ఒయ్యారిభామా

అ॥ ఒప్పులకుప్పా రప్పించావే చెంతకు
ఒయ్యారిభామా దోచావే నా మనసు

ఆ॥ అడిగానా నిను రమ్మని
కోరానా నీ మనసిమ్మనీ

అ॥ ఆడగక ఇచ్చిన నీ మనసు
ఆరాటం చెందే దెందుకో

ఆ॥ అడగక ఇచ్చిన నీ మనసు
గడబిడ చేస్తున్నందుకు ॥ఒప్పుల॥

అ॥ అడిగానా మల్లెపూవులా నవ్వమనీ
కోరానా మందారంలా కవ్వించమనీ

ఆ॥ నీ కొంటె చూపులే అడిగెనులే నను నవ్వమనీ
నీ చిలిపి చేష్టలే కోరెనులే నను కవ్వించమనీ ॥ఒప్పుల॥

ఆ॥ అడిగానా అందాలను దోచుకొమ్మని
కోరానా అనురాగం దాచుకొమ్మని

అ॥ మెరుపు తీవెలా మెరిసె నీ మేని అందం
నను అడిగెనులే నిలువెల్లా దోచుకొమ్మని
మమతలు పెంచే నీ కనుచూపులు
కోరెనులే నను ఎదలో దాచుకొమ్మని
అడిగెను లే కోరెనులే దాచుకొమ్మని దోచుకొమ్మని ॥ఒప్పుల॥

అ॥ ఆడిగానా అలలా ఆడమని (ఊగమని)
కోరానా కోయిలలా పాడమనీ (కూయమనీ)

ఆ॥ మగసిరి నిండిన నీ చిరునవ్వే
కోరెనులే నను ఆడమనీ
మృదువుగ పలికే నీ మాటలే సర్వమే
నను అడిగెనులే పాడమనీ ॥ఒప్పుల॥

# కారుమబ్బు కప్పింది

కారుమబ్బు కప్పింది
హోరుగాలి వీచింది
కన్నెపిల్ల వచ్చింది
వన్నెలాడి పిలిచింది ॥కారు॥

మగువ నన్నే చూచింది
మనసంత దోచింది
చిట పట చినుకులు కురిసాయి
తళ తళ మెరుపులు మెరిసాయి
(ఆ) చినుకుల్లో (నీ) చీరేమో తడిసింది
పడుచుదనం బయటికి పొంగింది
వలపు వాన దంచి కురిసింది
(ఆ) మెరుపుల్లో (నీ) మేనేమో మెరిసింది
గొంతులో ప్రేమగాధ
తలపులో హృదయ వీణ ॥కారు॥

# ఉగాదిపండుగ వచ్చేనులే

ఉగాది పండుగ వచ్చేనులే
ఊరికి వెలుగను తెచ్చేనులే
మనసులు నిండుగ వెలుగునులే
మనుషుల మనసులు మారునులే
మనిషికి మమతలె నిలుచునులే
ఉన్నవారిదే సాగదులే పెద్దరికం
లేనివారికి వున్నదిలే సగభాగం
అవకాశాలు పెరుగునులే
పేదల ఆశలు చిగురించునులే
కొత్తవత్సరం ఇచ్చునులే
పేదల మనసుకు శాంతి, నిరు
పేదల ఇళ్ళకు కాంతి ॥ఉగాది॥

సమసమాజము సమకూరునులే
సామ్యవాదము గెలుచునులే
కులమత భేదము కూలునులే
కలిమిలేములు కలియునులే ॥ఉగాది॥

# రూపు నీది

అ॥ రూపం నీది
ప్రేమ నాది
ఆ॥ నా సొగసే నీదీ
నా వయసే నీదీ
అ॥ నీ రూపూ-నా ప్రేమా
లోకానికి నిలయం
ఆ॥ నీ వయసు—నా వలపూ
ఈ జగానికే ప్రాణం-
అ నీ కన్నులే వెన్నెల కురిసే-
నీ నవ్వులే పువ్వులు విరిసే-
ఆ॥ నీ రూపు రెచ్చగొట్టే వలపులలో-
నీ ప్రేమ వెచ్చన చేసే తలపులలో
నీ అందమే విందుగా
ఆనందమే పసందుగా- ॥రూపం॥

అ॥ నీ గడుసు దనం
ఆ॥ నీ పడుచు దనం
అ॥ నీ ఉడుకు తనం
ఆ॥ నీ దుడుకు దనం
పొంగి పొరలితే-
ముందుకు దూకితే-
జగమంతా ప్రేమమయం
జీవితమే రాగమయం ॥రూపం॥

# "ఒద్దు మామో"

ఒద్దు మామో–మనకొద్దు మామో
ఈ పాడుకల్లు మనకొద్దుమామో ॥ఒద్దు॥
మహామ్మారి కల్లుముంత
మాయదారి బీరు సీస- ॥ఒద్దు॥
కళ్ళుముయ్యి–అటు మళ్ళిచూడకు
కల్లు మత్తు–సారా నిషా
మళ్ళీ మళ్ళీ నీ మనసు లాగుతుంది రామావా
సారా నిషా రోజు రోజు
సాని కొంప మోజు మోజు
కల్లు మరిగి నోడు–ఇల్లు మరిసి నోడె
తల్లిమాట దాటి నోడె
ఆలిగొంతు కోసి నోడె- ॥ఒద్దు॥
సారాచుక్క రుచికి నీవు
లోనై పోతావేమో
చెత్త చెత్త రకాలతో
పొత్తులు చెస్తావేమో
కల్లుకిచ్చే విలువ (నీవు)
కట్టుకున్న ఆలి కిస్తే
కాదా మన బతుకంతా సంతోషం- ॥ఒద్దు॥
కల్లు అంగడి మనకు-కలసిరాదురా మామా
సార దుకానం మనకు-చావురోరి మామా
కల్లునిషా కళ్ళకెక్కితే
ఇల్లుగుల్ల చేసేవు
తల్లి పిల్లల మరిచేవు- ॥ఒద్దు॥

# మృగం కంట నీరు కారితే

మృగంకంట నీరు కారితే
ముద్దా వేటగాడికి
జంతుజాలం ఏడ్చినా
కర చరణాలు మోడ్చినా
కలుగుతుందా కనికరం—ఈ కసాయి
వేటగాళ్ళకు— ॥మృగం॥

దారి తప్పిన పశులు
త్రోవ తప్పిన మృగాలు
అవుతున్నాయి బలి
ఈ వేట గాళ్ళకు ॥మృగం॥

వేటగాళ్ళ సరదా(లు)
ప్రాణాంతకాలు మృగాలకు—
తెలుసు మనిషికి ప్రాణాల తీపిఅని
అయినా తీస్తాడు ఇతరుల ప్రాణాలను
ప్రాణాలు పోయడం ఒకడికే తెలుసు
ప్రాణాలు తీయడం అందరికీ తెలుసు- ॥మృగం॥

# తెల్ల తెల్లని చీరకట్టి

తెల్ల తెల్లని చీర కట్టి
తెలిమల్లె పూలు పెట్టి
మెలి మెల్లిగ నడిచేదానా
పల్కి పలకని చిన్నదానా
నన్ను పలకరించవే
అందాలు కురిపించవే- ॥తెల తెల్లని॥

చూసీ చూడని చూపులేల
చిరునవ్వుల వానలేల
అందాల రామ చిలుక
అందకుండ పోయేవేల ॥తెల తెల్లని॥

చెయ్యి చెయ్యి కలుపవే
నెయ్యము నాతో చెయ్యవే
వలపులు కురిపించి మురిపించిపోవే
చలువచీర కట్టుకుని
కలవపూల రవికె తొడిగి
కడవ సంకన పెట్టుకొని, నువు
చెరువు గట్టుకు వెళ్ళుతుంటే
మల్లెపూల వానకురిసె
చలువచీర సగము తడిసె
పడుచుదనం పైకి పొంగె
నా ఒళ్ళంతా పులకరించె ॥తెల తెల్లని॥

# రాజులు వెళ్ళారు

రోజులు మారాయి
కాలం మారింది
రాజులు వెళ్ళారు
రైతులు వచ్చారు
రైతులు వెళ్లారు
కూలీలు వచ్చారు
కూలీలు వెళ్లొచ్చు
బిచ్చగాళ్లు రావచ్చు ॥రోజులు॥

పద్యం పోయింది
గేయం వచ్చింది
గేయం పోయింది
గద్యం వచింది
గద్యం పోవచ్చు
చోద్యం రావచ్చు ॥రోజులు॥

సంధ్యలు పోయాయి
చదువులు వచ్చాయి
చదువులు పోయాయి
సమ్మెలు వచ్చాయి
సమ్మెలు పోవచ్చు
చీటికిమాటికి రావచ్చు
బందులు రావచ్చు ॥రోజులు॥

నాటకాలు పోయాయి
సినిమాలు వచ్చాయి
సినిమాలు పోవచ్చు
చిల్లర నాట్యాలు రావచ్చు ॥రోజులు॥

పొడుగు రవికెలు పోయాయి
పొట్టి బ్లౌజులు వచ్చాయి
పొట్టి బ్లౌజులు పోవచ్చు
వట్టి శరీరాలే మిగలొచ్చు ॥రోజులు॥

మద్యపానం పోయింది
మధువుల సేవ వచ్చింది
మధువులు పోవచ్చు
మలినం ఇక తాగొచ్చు
మనషులు వెంటనె చావొచ్చు ॥రోజులు॥

# ఆకలి ఆకలి ఎందరికో

ఆకలి ఆకలి ఎందరికో
మరి ఆమాటే తెలియదు కొందరికీ ||ఆకలి ఆకలి||

పంచభక్ష్యాలు కొందరికీ
గంజిమెతుకులే ఎందరికో ||ఆకలి ఆకలి||

చీనాంబరములు కొందరికీ
చింపిరి పాతలు ఎందరికో ||ఆకలి ఆకలి||

గూడే ఉండదు ఎందరికో
మేడలు, మిద్దెలు కొందరికీ ||ఆకలి ఆకలి||

నిత్యఅవసరాలే తీరవు ఎందరికో
అవసరమంటూ ఉండదు కొందరికీ ||ఆకలి ఆకలి||

అంతులేని దు:ఖం ఎందరికో
అక్కరలేని సుఖం కొందరికీ ||ఆకలి ఆకలి||

ఈ అందరితో-ఆకొందరు
పాలుపంచుకో గలిగితే
మనసు కలుపుకోగలిగితే
ప్రపంచమంతా శుభోదయం
మనిషిబ్రతుకే (కాదా) సుఖమయం ||ఆకలి ఆకలి||

# రాగసుధ **

### షణ్ముఖ ప్రియరాగం - ఆదితాళము

ప॥ సర్వకళలకు, రాగసుధ,
సంగీత సాహిత్య సరాగతాగాల ॥స॥

అ-ప॥ సరిగమల స్వర, రాగసుధా,
రాగ, తాళ, భావ సంగీతసుధ ॥స॥

॥ అప్సర కిన్నెర, ప్రణయనృత్యములు
కైలాస వాసుని ప్రళయ, తాండవములు
త్యాగయ, అన్నమయ, గానమధురిమలు ॥స॥

మయూర నాట్యాలు, కోకిల గానాలు,
హంస నడకలు, చిలుక పలుకులు

మందార మాధుర్యం, రాగసుధ
అందాల ఆలయం, రాగసుధ ॥స॥

** మొదటి పాట 'కిన్నెర' చివరిపాట ॥స॥
"రాగసుధ" ఆయాసంస్థలకు "ప్రారంభ-ప్రార్థనలు"

# వాడుకభాషలో

శ్రీమాలకొండయ్యగారి కవితలు చదివాను. ఆయన కవిత్వములో స్వతంత్రమైన బాణీవుందని, పాండిత్య ప్రదర్శనకంటే పండితపామరులకు సూచిగా తన మనోభావాలను వాడుకభాషలో అందివ్వాలన్న ప్రయత్నం ప్రస్ఫుటంగా కనిపించింది.

ఆయన రచనలలో లౌకికమైన అన్నిభావాలను స్పృశించారు.

ఒకభావకవిగా-"అనిపిస్తుంది. నాకు అనిపిస్తుంది.

ఆవేశం, ఆవేశం, ఉద్వేశం, ఉత్సాహం, అడ్డుగట్లు లేకుండా తోసుకువస్తుంటే, కలం, కుంచె, రంగులతో, కథలు కవితలుగా కాలాన్ని చిత్రించాలని" అంటారు.

ఎంతో అర్థంతోకూడిన భావాన్ని అరటిపండొలిచి చేతిలోపెట్టినట్లుగా చెప్తారు. మరియొకచోట-కలలను అలలకు పోలుస్తూ

"అలలకు లేదు అలసట-కలలకు లేదు వేసట"
"ముద్దుమురిపెం ముగియకముందే,
కౌగిలి గిలిగింతలు పొందకమునుపే
కడలి అసూయతో అలలను వెనక్కి లాగేస్తుంది.
కళ్ళెంవేస్తుంది".

"కలలోకన్న అనుభూతి పొందకముందే
చుప్పనాతి నిద్ర, ఓర్వలేకచప్పున యీర్ష్యతో,
మేల్కొల్పుతుంది" నిత్యానుభవాన్నికవి
తనభాషలో కట్టెదుట నిలిపారు

అందాల గోదావరిని గురించి చెప్తూ

"సరస కిన్నెరసాని, శబరి చెలికత్తెగా
ఒయ్యారములతోడ వెయ్యిమెలికలు తిరిగి

గల గలా మెరిసేను గోదావరి
మిల మిలా మెరిసేను గోదావరి"

అని ఎంత శృంగారంగా చెప్పారో చూడండి !
మరియొక గేయంలో ACC NO. 742
రైతును చూచి బాధపడుతూ, 784 MAL

"మట్టిలో మణులు పండిస్తాడని
పరిశ్రమలకు పట్టణాలకు ప్రాణంపోస్తాడని
అంతా రైతుదే రాజ్యమని పొగడి అతణ్ని ఉబ్బేస్తారు"

శివునిగూర్చి స్తుతిస్తూ - గ్రామీణభాణలో 894-6200

"ఈశా అంటే కాసునయా
శంకర అంటే శమించునయ్యా
దేవదేవుడు యితడేనయ్యా,
అందరి దైవము యితడేనయ్యా,

ఇంకా ఆదిపరాశక్తిపై, పార్వతీ పుత్రుడు గణేశునిపై, మీదు మిక్కిలి ఏసునాధునిపై కూడ రచించారు భక్తిగీతాలు, తారతమ్య భేదాలులేకుండా. ఇంకా "ఎవరో. నీవెవరో చల్లగవీచే గాలివి నీవా? పెనుగాలిలో బలము నీవా? ఎవరో నీవెవరో". అని చైతన్యాన్ని ప్రశ్నిస్తే

"కైలాస శిఖరం ఉన్నతినేను, కన్యాకుమారి అగ్రం నేను.
మనిషి మమతలో పెరిగే మమతను నేను.
మానవ క్షేమంకోరే. ప్రేమమూర్తిని"

అని సమాధానం చెప్పిస్తాడుకవి.

శ్రీ మాలకొండయ్యగారి కవితలలోగల చమత్కారాన్ని నాకు తెలిసినభాషలో విపులీకరించటానికి ప్రయత్నించాను.

పెండ్యాల నాగేశ్వరరావు.



శ్రీమతి సి. ఇందిరామణిగారు శాస్త్రీయ, లలిత సంగీతాల్లో ప్రవీణురాలు. ఈమె మాల కొండయ్యగారి మధుర గేయాలకు స్వరకల్పన గావించి అందాలు దిద్దారు. వీరి కుటుంబమే "రాగసుధ"గా మారింది ఆమె సంగీతకృషి కారణంగా.

శ్రీ వి. మురళీకృష్ణగారు కూడా అనేక పాటలకు స్వర కల్పనచేసి మాలకొండయ్యగారి పాటలను టెలివిజన్ ద్వారా తెలుగు ప్రజానీకానికి అందిచ్చారు. ఈ "హంసధ్వని" అందరిని రంజింపజేస్తుందని ఆశిస్తున్నాము.

కిన్నెర ఆర్ట్ థియేటర్స్



శ్రీ యల్. మాల కొండయ్యగారు అనేక కవితలు అల్లి, ప్రచురణ రూపకంగా తెలుగు ప్రజానీకానికి అందివ్వడం చదువరులకు పరిచయమే. అందులో అనేక గేయాలు ఇప్పుడు "హంస ధ్వని" అనే పేరుతో శ్రీమతి సి. ఇందిరామణి, శ్రీ వి. మురళీకృష్ణగార్ల స్వరకల్పనతో ప్రచురిస్తున్నాము. ఈ అందాల రాగమాలిక సంగీతకారులకు, తెలుగు పాఠకులకు ఎంతో ఉపయోగపడుతుందని, ఆశిస్తున్నాము.

వారి రచనలు :

1. జీవిత వలయాలు 2. మనిషికి మనిషి
3. కాలం వెంట కవి 4. పాపా నీకు తెలుసా ?
5. న్యాయానికి నోరు 6. హంస ధ్వని

అచ్చులో : మధువాణి (ఉమర్ ఖయ్యూం)